# విమానదాడి - మన కర్తవ్యం



రచయిత

కామ్రేడ్ జోశ్యభట్ల సత్యనారాయణ



ప్రజాశక్తి కార్యాలయం
బెజవాడ

3314

3

# పరిచయం

జపాన్ ఫాసిస్టు దుండగీడులు మన మాతృదేశ సరిహద్దునే పొంచి కూర్చుని వున్నారు. మన దేశంలో కాకినాడ, విశాఖపట్నం, కలకత్తా, చిటగాంగ్, వగైరా పట్టణాలు, గ్రామాలు అప్పుడే విమానదాడులకు గురి అయ్యాయి. భారత ప్రజలు ధన ప్రాణ నష్టాలను పొందారు. జపాన్ సైన్యాలు బర్మాదేశంలో వున్నంతకాలం మనదేశానికి దండయాత్ర ప్రమాదం అలాగే వుంటుంది. అందుచే ప్రజలు విమానదాడులనుండి రక్షణ చేసికొనే వుపాయాలను తెలిసికోవడం అవసరం.

ప్రజలలో వ్యాపించివున్న నిరుత్సాహాన్ని, ఉపేక్షాభావాన్ని తొలగించి, దేశరక్షణ కార్యాలలోను, విమానదాడి రక్షణ సంస్థలలోనూ ఉత్సాహంతో పాల్గొనునట్లు చేయడానికి జాతీయ ప్రభుత్వం కావాలి. ప్రజావిశ్వాసాన్ని చూరగొన్న ప్రజాప్రతినిధులతో నిర్మించబడిన జాతీయ ప్రభుత్వం ప్రజలలో ఉత్సాహాన్ని, దీక్షను కల్గించుతుంది. నిరంకుశాధికారుల ప్రవర్తనవల్ల ప్రజలలో వ్యాపించివున్న సందేహాలను తొలగించుతుంది. తమదేశంకొరకు, తమ స్వాతంత్ర్యంకొరకు జరుగుతున్న యుద్ధమనే విశ్వాసం ప్రజలలో కలిగితేనే యుద్ధకృషి జయప్రదంగా జరుగుతుంది. అట్టి విశ్వాసం ముస్లింలీగ్-కాంగ్రెసు వగైరా ప్రధాన రాజకీయ సంస్థల నాయకులతో కూడిన జాతీయ ప్రభుత్వమొక్కటే కల్గించుతుంది.

నేడు విమానదాడి రక్షణ ఏర్పాటులు ప్రభుత్వానికి సంభందించినవే గాని తమవి కావనే ఉపేక్షాభావం ప్రజలలో వ్యాపించివుంది. విదేశ ప్రభుత్వమగుటచేతనూ, ప్రజల అవసరాలను ఎన్నడూ సుహృద్భావంతో చూడని నిరంకుశాధికారుల చేతులలో విమానదాడి రక్షణ ఏర్పాటులు వుండుటకూడ యిందుకు కారణం. కాని ప్రభుత్వంపై ద్వేషంతో రానున్న

ప్రమాదం గుర్తించక పోవడం ప్రజలకే ప్రమాదం. మన మాతృదేశంపై విమానదాడులు జరుగునపుడు వానినుండి రక్షించుకొనే మార్గాలను, నష్టాలను తగ్గించుకొనే విధానాలను మన ప్రజల మేలుకొరకే మన మవలంభించాలి. ప్రజా సేవకులైన వారందరూ రక్షణోపాయాలను ప్రజలకు బోధించాలి.

ఈ చిన్ని పొత్తం విమానదాడులనుండి రక్షణోపాయాలను సులభ శైలిలో వివరించుతుంది. శత్రువులు ప్రయోగించే వివిధ మారణాయుధాలు కల్గించే ప్రమాదాలు, వానినుండి కల్గే నష్టాలను సాధ్యమైనంత తగ్గించేందుకు అవలంభించవలసిన జాగ్రత్తలను తెలియజేస్తుంది. ప్రజా సేవకులు యీపుస్తకాన్ని వినియోగించుకొని, విమానదాడి జాగ్రత్తలను గురించి ప్రజలకు బోధించుతారని ఆశించుతాము.

— సంపాదకవర్గం.

# 1. విమానదాడులు - దాడి జాగ్రత్తలు

## దాడుల ఉద్దేశ్యం

నేటి యుద్ధాలలో సైన్యాలు, ప్రభుత్వభవనాలు, ఆయుధ కర్మాగారాలు, హార్బరులు మొదలైనవే కాకుండా, ప్రజా సామాన్యంకూడా యుద్ధలక్ష్యమే. ఎందువల్లనంటే ప్రజల మనోధైర్యం చెడినప్పుడు (Demoralisation) శత్రువుకు విజయం సులభసాధ్యం. నేటి యుద్ధాలు ఉత్పత్తిమీద ఆధారపడినవగుటచేత యుద్ధపరికరాల ఉత్పత్తి, ఆహార పదార్థాల ఉత్పత్తి నాశనం కావడంవల్లనూ; రాకపోకమార్గాలు, ఎలక్ట్రిసిటీ, నీటిపైపులు మొదలైనవి తెగిపోయి ప్రజల నిత్యజీవితావసరాలు లభించక పోవడంవల్లనూ; ఆస్తికి ప్రాణానికి నష్టం, అంగవైకల్యాలు విశేషంగా కలగడంవల్లనూ; ప్రజలలో మనోధైర్యంచెడి ఓటమితత్వం ప్రబలుతుంది. పై కారణాలవల్ల ప్రజలలోనే కాకుండా సైన్యాలలోకూడా మనోధైర్యం చెడుతుంది. యుద్ధపరికరాలు, ఆహారపదార్థాలు సరిగా అందకపోయినా, తాము ప్రేమించే భార్యాబిడ్డలు పైనష్టాలకు గురిఅవుతున్నా సైనికులు తీవ్రంగా పోరాటం సాగించలేరు.

## బాంబర్లు, ఫైటర్లు

ప్రజలలోనూ, సైన్యాలలోనూ యీవిధంగా మనోధైర్యం చెడడం ప్రధానంగా విమానదాడులవల్లనే సాధ్యమౌతోంది. యుద్ధాలలో పాల్గొనే దాడులుచేసే విమానాల (Bombers) శక్తి, పోరాడే విమానాల (Fighters) శక్తి నేడు చాలా హెచ్చింది. ఇవి గంటకు 400 మైళ్ళ వేగంతో పోగలవు. 40000 అడుగుల ఎత్తువరకు ఎగురగలవు. 4000 పౌన్ల

బరువు మోయగలవు. ఆగకుండా 5000 మైళ్ళవరకూ ప్రయాణంతో పోగలవు. అర్ధరాత్రిలందుకూడా తమ పనులు స్వేచ్ఛగా సాగించగలవు. సుమారు 20,000 అడుగుల ఎత్తునుండికూడా బాంబులు వేయగలవు. 200 అడుగుల ఎత్తుకుకూడావచ్చి బాంబులు మరఫిరంగులు ప్రయోగించగలవు.

విమానదాడులలో ఉపయోగింపబడేవి చిచ్చు లేక మంటలబాంబు (Incendiary Bombs) లని, పేలుడుబాంబు (High Explosive Bombs) లని, విషవాయువు (Poison gases) లని మూడురకాలు.

## రక్షణ మార్గాలు

విమానదాడుల నుండి రక్షణమార్గాలు రెండు రకాలున్నాయి.

**1.** ఎదిరించే రక్షణ (Active Defence):—ఇది ఫైటర్లు, విమాన వ్యతిరేక శతఘ్నుల (Anti air craft guns) వల్ల సాధ్యమౌతుంది.

2. ఎదిరించని రక్షణ (Passive Defence):—ఇది విమానదాడి జాగ్రత్తల (Air raid precautions) వల్ల సాధ్యమౌతుంది. ఈ జాగ్రత్తలలో ముఖ్యమైనవి హెచ్చరికలిచ్చే విధానం (Warning system) రక్షణాశ్రయాలు (Shelters), మంటలనార్పుట (Fire fighting) రక్షణ (Rescue) ప్రథమ చికిత్స (First Aid) మొదలైనవాటిలో శిక్షణ, కావలసిన పరికరాలు జాగ్రత్త పెట్టుకొనుట మొదలైనవి. వీటివల్ల దాడుల నష్టాలను తగ్గించి ప్రజల మనోధైర్యాన్ని కాపాడి దేశపోరాటశక్తిని క్షీణించకుండా చేయడానికి వీలవుతుంది.

---

# 2. మంటల బాంబులు
## (INCENDIARY BOMBS)

ఇవి రసాయన పదార్థాలతో నింపబడి తాకిడివల్ల అంటుకొని మండుతాయి. వీటిని (1) క్రింది సమస్త వస్తువులు దాడిచేసే విమానాలకు స్పష్టముగా కనబడడానికి (2) మంటలనార్పు మోటారుదళాలు (Fire Brigades) కూడా ఆర్పలేనంతటి మంటలు కల్గించడానికి (3) ఆస్తికి నష్టం కల్గించడానికి (4) మర ఫిరంగులతో కాల్చడానికి యిండ్లలోవున్న మనుష్యులకు విపరీతమైన భయంపుట్టించి బయటకు తరమడానికి ఉపయోగిస్తారు.

### రకాలు—కలిగే ఫలితాలు

ఈ బాంబులలో ముఖ్యమైన రకాలను గురించి వాటి ఫలితాలను గురించి తెలుసుకుందాం.

### 1. జపాను భాస్వరపు బాంబు (Japanese phosphorous Bomb.) (పటము 8వ పేజీలో).

ఇది సుమారు 100 పౌన్లు బరువుండి అ. 3 అం. 4 పొడవు, అం. 7 వ్యాసం (అడ్డకొలత) కలిగి ఉంటుంది. ఇది ఉక్కు—రేకుతో చేయబడి, లోపల భాస్వరంతో కూడిన రబ్బరు గోళీలుంటాయి. ఈబాంబు దేనినైనా తాకగానే పగిలి ఈ గోళీలుచుట్టూ సుమారు 60 గజాలవరకు చెదరిపడి పొడిగాలి తగలగానే మండుట ప్రారంభించి, సమీపంలోవున్న వస్తువుల నంటిస్తాయి. ప్రతిగోళీ అం. 1 ఎత్తు, అం. 1 వ్యాసం ఉండి సుమారు 5 నిముషాలవరకు సుమారు అం. 6 ఎత్తు మంటతో మండుతుంది. ఈ గోళీలు మారుమూలలకుపోయి మన దృష్టినుండి తప్పించుకొని నష్టం కలుగ

చేస్తాయి. భాస్వరం శరీరానికి తగిలితే పుండుపడి సుమారు రెండు నెలల వరకూ మానదు.

ఈ బాంబులను కలప డిపోలవద్ద, పండిన చేలు మొదలగుచోట్ల తరచుగా ఉపయోగిస్తారు.

## 2. జపాను పేరఫిన్ వేక్సు బాంబు

ఇది సుమారు 135 పౌన్లు బరువుండి భాస్వరపు బాంబు కొలతలే కలిగి ఉంటుంది. బాంబు దేనిపైనా తాకి పగలగానే దీనిలో ఉండే మైనం వంటి పదార్థం మండుతూ బయటపడి వ్యాపిస్తూ వస్తువుల నంటిస్తుంది. ఇది సుమారు రెండు గంటలవరకూ మండుతుంది. దీనిపై నీరుపోస్తే అది నీటిపై తేలి మంటలు అధికమై వ్యాపిస్తాయి.

## 3. జర్మన్ నూనె బాంబు (పటము 10 వ పేజీలో)

ఇది సుమారు 250 పౌన్లు బరువుండి అ. 5 అం. 3 పొడవు అం. 14½ వ్యాసం గల్గిఉంటుంది. ఈ బాంబులో సుమారు 15 గాలన్ల పెట్రోలు లేక నూనె, లేక రెండూ కలిపి ఉపయోగిస్తారు. ఇది పగిలినపుడు మండుతున్న నూనె సుమారు 500 చదరపుగజాల ప్రదేశంపై చెదరిపడి పెద్దమంటలు కలిగిస్తూ వస్తువు లంటిస్తుంది.

## 4. మెగ్నీషియమ్ బాంబు (పటము 11 వ పేజీలో)

దీనినే థర్మయిట్ బాంబు అనికూడా అంటారు. ఈబాంబు గుల్ల మెగ్నీషియమ్‌తో చేయబడి లోపల థర్మయిట్ ఉంటుంది. మెగ్నీషియమ్ (1300°c) థర్మయిట్ (2500°c) కూడా విపరీతమైన వేడితో మండుతాయి. వీటి వేడికి అం. $\frac{1}{4}$ తక్కువ మందంగల ఉక్కు రేకుకూడా కరిగిపోతుంది.


తోకరెక్కలు
బొగ్గుపొడి
మెగ్నీషియమ్
నూనె
కర్రపొట్టు
పెట్రోలు
ఒత్తి

ఇవి మండుతున్నపుడు వీటిపై నీరుపోస్తే అది ప్రాణవాయువు (Oxygen) గాను, ఉదజని (Hydrogen) గాను విడదీయబడి మంటలు తీవ్రమవతాయి. థర్మయిట్ మండడానికి ప్రాణవాయువుకూడా అవసరంలేదు. ఈ బాంబు దేనినైనా తాకినపుడు ముందుగా థర్మయిట్ అంటుకొని మండుతూ మెగ్నీషియమ్‌ను అంటిస్తుంది. థర్మయిట్ మండుట బాంబు కిందపడిన తర్వాత సుమారు అరనిముషం రెండు నిముషాలమధ్య పూర్తి అవుతుంది. అంటుకొన్న మెగ్నీషియమ్ కరిగి దూరంగా వ్యాపించి వస్తువుల నంటిస్తూ సుమారు 20 నిముషాలవరకు మండుతుంది.

కొన్ని మెగ్నీషియమ్ బాంబులలో పేలుడుమందుకూడా ఉపయోగిస్తారు. ఇది థర్మయిట్ మండుట పూర్తిఅయ్యేసరికి పనిచేసి, మండు మండుతున్న మెగ్నీషియమ్‌ను చాలా దూరము చెదిరిపడునట్లు చేస్తుంది. కాబట్టి రక్షణలేనిదే ఇట్టి బాంబు క్రిందబడిన అరనిముషం రెండు నిముషాల మధ్య దగ్గరకు వెళ్ళడం ప్రమాదకరం.

మరికొన్ని చిన్నరకపు మెగ్నీషియమ్ బాంబులలో అడుగుభాగాన్ని పేలుడుమందు సుమారు అం. 3 పొడవుగల ఉక్కు గొట్టములో ఉంచి ఉపయోగిస్తున్నారు. ఇది బాంబు క్రిందపడిన సుమారు 7 నిముషాల లోపల ఎప్పుడైనా పనిచెయ్యవచ్చును. దీనిలో ఉక్కుముక్కల ప్రభావం కూడా ఉంటుంది. ఈ ముక్కలు ప్రాణనష్టం కలుగచేస్తాయి. కాబట్టి గట్టి రక్షణ (గోడ మొదలైనవి) లేనిదే 7 నిముషాల లోపల ఈ బాంబును సమీపించడం ప్రమాదకరం.

మెగ్నీషియమ్ బాంబులు సుమారు 2¼ పౌనులు మొదలు 25 పౌన్ల వరకు బరువుగలవి వున్నాయి. 2¼ పౌనులు బరువుగలవాటిని జర్మనులు ఉపయోగిస్తారు. అంతకు ఎక్కువ బరువుగలవాటిని జపాన్ ఉపయోగిస్తుంది. జర్మనులు ఉపయోగించు 2¼ పౌన్లు (అనగా సుమారు 1 కిలో

గ్రాము) బరువుగలవాటిని "కిలో మెగ్నీషియమ్ ఎలక్ట్రాన్ బాంబు" లని అంటారు. ఇది అం. 14 పొడవు (బాంబు అం. 9, తోక అం. 5) అం. 2 వ్యాసం కల్గి వుంటుంది.

మెగ్నీషియమ్ బాంబులు యీ దిగువ కారణాలవల్ల ఎక్కువ నష్టం కలిగిస్తాయని చెప్పవచ్చును.

1. ఇవి తక్కువ బరువగుటచేత బాంబర్లు ఎక్కువగా వీటిని మోసుకొని పోగలవు.

2. ఇవి సుమారు 25 చొప్పున పెట్టెల (Containers) లో అమర్చబడి ఒకేసారి ఎక్కువ సంఖ్యలో విడుదలచేయబడే మార్గముంది.

3. ఇవి ఎక్కువ వేడితోనూ వెలుతురుతోనూ మండుతాయి.

4. కరిగిన మెగ్నీషియమ్ చాలాదూరం వ్యాపిస్తుంది.

5. ఇంతే బరువుగల ఏ యితర బాంబుకన్న ఇది ఎక్కువకాలం మండుతుంది.

6. దీని రెక్కలు అంటించే మెకానిజమ్‌తప్ప మిగత బాంబంతా మండే పదార్థంతో చేయుబడినదే.

7. మండుతున్న బాంబుపైనీరుపోస్తే మంటలుఅధికమై వ్యాపిస్తాయి.

8. మంటల నార్పే రసాయనసాధనాలు (Fire extinguishers) దీని నార్పడానికి నిరుపయోగాలు.

మంటల బాంబులలో పైనచెప్పిన రకాలేగాక పొటాసియమ్ సోడియమ్ బాంబు మొదలైన యితర రకాలు ఉన్నాయి. పొటాసియమ్ సోడియమ్ బాంబులు తడితగలగానే మండుతాయి. వీటిని తరచు హార్బరులు ఓడలు మొదలైన వాటిపై ఉపయోగిస్తారు.

మంటలబాంబులు కిందపడిన 5 నిముషాల లోపల పనిచేయడం ప్రారంభించకపోతే అటుపిమ్మట పనిచేయవు.

ప్రతి మెగ్నీషియమ్ బాంబు పేలుడుమందు కలదిగానే భావించాలి.

మంటల బాంబులలో బరువైన రకం తమ బరువువల్ల, మెగ్నీషియమ్ బాంబులు తమ వేడివల్ల యిండ్ల కప్పులను చీల్చగలవు.

---

# 3. స్టిరప్ పంపు

మెగ్నీషియమ్ బాంబును నీటితో ఆర్పడానికి స్టిరప్‌పంపు అవసరం. ఇది మెగ్నీషియమ్ బాంబు విషయంలోనే కాకుండా ఏ యితర మంటలనైనా (ఇళ్లు మొదలైనవి అంటుకున్నపుడు) ప్రాథమిక దశలోనే ఆర్పడానికి బాగా సులువుగా ఉపయోగపడే తేలికయైన చిన్నసాధనం. దీనికి అ. 30 పొడవుగల రబ్బరుగొట్టం (Hose) దానిచివర "నాజిలు" ఉంటాయి. ఈ "నాజిలు" ద్వారా నీరు ధార (Jet) గాను, జల్లు (Spray) గాను, వస్తుంది. ధార నాజిలు వద్దనుండి అ. 30 దూరం జల్లు అ. 15 దూరం పోతాయి. ధారలో నిముషానికి సుమారు $1\frac{3}{4}$ గాలన్లు, జల్లులో $\frac{3}{4}$ గాలను నీరు ఖర్చవుతుంది.

కాబట్టి స్టిరప్‌పంపు (1) మెగ్నీషియమ్ బాంబును, మంటల బాంబులచే అంటించబడిన యితర వస్తువులను ఒకేసారి ఆర్పడానికి (2) తగినంత దూరంలో ఉండి వీటిని ఆర్పడానికి (3) నీరు వృధా కాకుండా అవసరమైన చోటనే ఉపయోగించడానికి (4) సాధారణ యితర అగ్నిప్రమాదాల లోనూ, ఉపయోగపడుతుంది.

ఈ పంపును ఉపయోగించిన వెంటనే రబ్బరు గొట్టంనుండి నీటిని పూర్తిగా తొలగించాలి. లేనిచో గొట్టం పాడవుతుంది. కనీసం వారాని కొకసారి పంపు పైభాగాలను 'గ్రీజ్' పూసి శుభ్రించేసి లోపలిభాగాలను ఆయిల్ వెయ్యాలి.

### ఉపయోగించుట

ఈ పంపు ఉపయోగించడానికి ముగ్గురు మనుష్యులుంటే పూర్తి ప్రయోజనం పొందవచ్చును. ఒకరు నాజిలు ఉపయోగించి మంటలు ఆర్ప డానికి (నెం. 1) మరొకరు నీటిని పంపుచేయడానికి (నెం. 2) ఇంకొకరు నీటిని సప్లయి చేయడానికి (నెం. 3) ఉండాలి.

నెం. 1 యీ దళానికి నాయకుడుగా ఉండి యీదిగువ ఆజ్ఞలిస్తూ పని చేయించాలి. (1) మొదలెట్టు (Get to work) (2) ఇక్కడ (Buckets here) (3) నీళ్లు (Water on) (4) ఆపు (Water off) (5) పదండి (Nock of and make up.)

నెం. 1 నాజిలును పడుకొని ఉపయోగించడం వలన అసలు నిప్పు ఎక్కడ ఉన్నదీ స్పష్టంగా కనబడడానికి అవకాశంఉంటుంది.

---

## 4. మంటలబాంబు లార్పుట

## (INCENDIARY BOMB CONTROL.)

మంటలబాంబుల్ని ఆర్పడంలో ముఖ్యంగా గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే బాంబులకన్న ముందుగా బాంబులవల్ల అంటుకున్న యితర వస్తువుల్ని ఆర్పాలి. లేకపోతే బాంబును ఆర్పేసరికి ఆ వస్తువులు

పూర్తిగా తగలబడి పోతాయి. ఇట్లు అంటుకున్న యితర వస్తువుల్ని (ఇంట్లు, ఇంట్లలోని సామానులు వగైరా) ఆర్పడానికి నీరు అధికంగా ఉపయోగించాలి.

## 1. భాస్వరపు బాంబును ఆర్పుట

ఈ బాంబు క్రిందపడగానే చుట్టూ చెదరిపోవు గోళీలను అన్నింటిని ఒకేసారి ఆర్పాలి. వీటిని ఆర్పడానికి తడి యిసుక లేక మట్టిగాని, చెంబులతో లేక గొట్టాల (Scoops) తో లేక గరిటెలతో లేక స్టిరప్‌పంపు జల్లుగా నీటినిగాని ఉపయోగించవచ్చును. పిమ్మట గరిటెలతోగాని, గొట్టాలతోగాని వాటిని నీటితో ఆర్పితే ఒకనీరుగల బకెట్టులోనికి, ఇసుక లేక మట్టితో ఆర్పితే దానితోనే ఒక ఖాళీ బకెట్టులోనికి ఎత్తి దూరంగా పడివేసి పూర్తిగా మండిపోయేవరకు చూడాలి. ఈ గోళీల నార్పేటపుడు చేతులు మైలతుత్తపు నీళ్ళలోగాని సోడా కలిపిన నీళ్ళలోగాని ముంచడం మంచిది. ఇలాచేయడంవల్ల భాస్వరం చేతులకు తగిలినా పుళ్ళుపడవు. భాస్వరం చేతులకు అంటుకున్న వెంటనే ఇలాచేసినా మంచిదే.

## 2. నూనెబాంబును, పేరఫిన్ వేక్సుబాంబును, పొటాసియం సోడియం బాంబును ఆర్పుట

పొటాసియమ్ సోడియం బాంబు తడితగలగానే మండుతుంది.

మండుతున్న నూనె పేరఫిన్‌వేక్సులపై నీరుపోస్తే మంటలు అధికమై వ్యాపిస్తాయి.

కాబట్టి వీటిని పొడుగుకర్రలు గల పారలతో (Large handled scoops or shovels) తో యిసుక లేక మట్టిపోసి ఆర్పాలి.

## 3. మెగ్నీషియమ్ బాంబును ఆర్పుట

(a) ఇసుకపద్ధతి:—(i) మెగ్నీషియమ్‌బాంబు 2¼ పౌన్లు బరువు గలదైతే (దీనిసైజు తోకతో అం. 14 పొడవు అం. 2 వ్యాసం) క్రిందపడిన ½ నిముషంలోపల దానిపై ఇసుకబస్తా ఉంచి దానివలన ప్రమాదంలేకుండా చెయ్యవచ్చును. ఇసుక బస్తాలు అం. 16½ పొడవు అం. 14 వెడల్పుఉండి, మూడువంతులు ($\frac{3}{4}$) ఇసుకతో నింపబడి కుట్టినవై ఉండాలి. ఈ బస్తాను రెండు చేతులతోటీ (చేతి వేళ్లు బాంబువైపున కుండకుండా) పట్టుకొని దానిచాటున ముఖాన్ని రక్షించుకొంటూ, కాళ్లు కొద్దిగావంచి బాంబును సమీపించి దానిపై మెల్లిగాఉంచి వెంటనే పరుగెత్తి వెనుకకు రావాలి. టైము సరిగా తెలియకపోయినా ఇంతకంటె పెద్దబాంబులయినా ఈ పద్ధతి అవలంబించరాదు.



(ii) లేదా బాంబు క్రింద పడిన రెండు నిముషాల పిమ్మట కరిగి మండుతున్న మెగ్నీషియమ్‌పై పొడుగు కర్రలుగల పారలతో యిసుక లేక మట్టిపోసి ఆర్పవచ్చును.

(b) నీటిపద్ధతి:—బాంబు క్రిందపడిన ఏడు నిముషాలలోపల అయినట్లయితే ఏ గోడనో, శరీరానికి రక్షణగా ఉంచుకొని, ఏడు నిముషాల పిమ్మట అట్టి రక్షణ లేకుండానూ స్టిరప్‌పంపుతో నీటిని ఉపయోగించి మెగ్నీషియమ్ బాం

బును ఆర్పవచ్చును. బాంబుచుట్టూ మండేవస్తువులు ఉన్నట్లయితే జల్లుగాను చుట్టూ మండేవస్తువులు లేనపుడు ధారగాను నీరు ఉపయోగించాలి. చుట్టూ మండేవస్తువులున్నపుడు ధారగా నీరు ఉపయోగిస్తే కరిగిన మెగ్నీషియమ్ చెదిరి దూరంగాపడి చుట్టూవున్న వస్తువుల్నికూడా అంటిస్తుంది. చుట్టూ మండే వస్తువులు లేనపుడు చెదరిపడినా ప్రమాదం వుండదు. ధార ఉపయోగించేటప్పుడు సెం. 1 అ. 30 దూరంలో ఉండవచ్చును.

ఈ విధంగా నీరు వుపయోగిస్తే సుమారు 20 నిముషాలవరకు మండే మెగ్నీషియమ్ జల్లుఉపయోగించేటపుడు సుమారు 4 నిముషాలలోనూ, ధార ఉపయోగించినపుడు సుమారు 2 నిముషాలలోనూ మండి ఆరిపోతుంది.

మెగ్నీషియం బాంబును ఆర్పేముందు ధారగా నీరు ఉపయోగించి చుట్టూ అంటుకున్న వస్తువుల్ని ఆర్పాలి. లేకపోతే ఈలోగా అవి తగలబడి పోతాయి.

## దాడికి ముందు తీసికోవలసిన జాగ్రత్తలు

1. మంటల బాంబులలో బరువైనవీ, అధిక వేడినిచ్చే మెగ్నీషియమ్ బాంబులు యిండ్లకప్పులు చీల్చుకుండా చూడాలి. అం. $\frac{1}{4}$ మందం గల ఉక్కురేకు కప్పులు, అం. 5 మందంగల మద్దతు కాంక్రీటు కప్పులు, అం. 6 మందంగల సాధారణ కాంక్రీటు కప్పులు, అం. 8 మందంగల యిటుక కప్పులు, అం. 18 మందంగల మట్టి లేక యిసుకతో రక్షింపబడే కప్పులు, బరువైన మంటల బాంబులచే చీల్చబడవు.

అం. 2 మందం యిసుక లేక మట్టి, అం $2\frac{1}{2}$ మందం బూడిద వేడి నుంచి రక్షణనిస్తాయి.

2. ఇంటిలో కఱ్ఱభాగాలు (దూలాలు. వాసాలు, తలుపులు మొదలైనవి) త్వరగా అంటుకోకుండా చెయ్యడానికి 1 ఔన్సు ఉప్పు 2 పౌనులు సున్నం ఒక గ్లాసునీరు వంతున కలిపి రెండు పూతలు పూయాలి.

3. తేలికగా నిప్పు అంటుకునే వస్తువుల్ని ఇండ్లకు దూరం చేయాలి.

4. మంటల నార్పే సాధనాలు స్టిరప్ పంపు, ఇసుకబస్తాలు, పొడవుకర్రగల పారలు, నీరు, యిసుక మొదలైనవి ప్రతి యింట్లోనూ జాగ్రత్త పెట్టుకోవాలి. వాటిని వుపయోగించేవిధానం యింట్లో ప్రతి ఒక్కరికి తెలిసియుండాలి.

---

# 5. రక్షణ (RESCUE)

## 1. తన బట్టలు అంటుకొన్నపుడు

చేతులతో ముక్కును నోటిని మూసుకొని వెంటనే క్రిందపడి మంటలు ఆరిపోయేవరకు దొర్లాలి. ఇలా దొర్లునపుడు శరీరం వంచకుండా ఉంచి శరీరంలో అన్నిభాగాలు నేలకు తగిలేలాగున చూడాలి.

## 2. ఇతరుల బట్టలు అంటుకొన్నపుడు

అతనిని క్రింద పడగొట్టి బట్టలు ఆరిపోయేవరకు దొర్లించాలి. క్రింద పడగొట్టునపుడు ఏకాలిమీదనో తన్ని పడగొట్టాలి. తన బట్టలు కూడా అంటుకోకుండా చూడాలి.

## 3. తనవి, యితరులవి అంటుకొన్నపుడు

అతనిని క్రింద పడగొట్టి దొర్లిస్తూ తానుగూడా అతనివెంట దొర్లాలి.

పైనచెప్పిన విధాలుగా దొర్లేటప్పుడు, మండేబట్టలు నేలను తగిలి నపుడు ప్రాణవాయువు దొరకక మంటలు ఆరిపోతాయి. ఈ విధంగా మంటల నార్పేటపుడు శరీరానికి కంబళిచుట్టి దొర్లడం, దొర్లించడం మంచిది.

## 4. పొగ మంటలతో కూడిన గదినుండి స్పృహతప్పిన మనిషిని రక్షించడం

ఇటువంటి గదియొక్క గుమ్మాలు, కిటికీలు అన్నీ మూయ్యాలి. ఇలా మూయ్యడంవలన గదిలో ఉన్న మంటలకి ప్రాణవాయువు దొరకక మంటలు తగ్గిపోతాయి. తరువాత ఒక తలుపును స్వల్పంగా జాగ్రత్తగా తెరచి లోపల ప్రాకుతూ ప్రవేశించాలి. మామూలు గాలికన్న తేలిక



అవడంవల్ల భూమిపై కొంత ఎత్తువరకు గాలిఉండి, ఆపైన పొగ వేడిగాలి ఉంటాయి. కాబట్టి ప్రాకుతూ వెళ్ళడంవల్ల పొగబాధలేకుండా తలకిందగాఉంచి గాలి పీల్చుకోవడానికి, క్రిందఉండే అన్ని వస్తువులు స్పష్టంగా చూడడానికి వీలవుతుంది. గదిలో సాధ్యమైనంతవరకు గోడల దగ్గరగానే వెళ్ళాలి. గోడల దగ్గరగా ఉండేభాగం కూలిపోయే అవకాశం తక్కువగా ఉంటుంది కాబట్టి గోడల దగ్గరగా వెళ్ళడం క్షేమకరం. ఇలా వెడుతూ స్పృహతప్పిన మనిషిని సమీపించాలి. (అతని బట్టలు అంటుకొని ఉంటే అతనిని అవి ఆరిపోయేవరకు దొర్లించాలి.) పిమ్మట అతని

వెల్లకిలా దొర్లించి అతని చేతులు రెండూ మణికట్లవద్ద గుడ్డతో కట్టాలి. తన మోకాళ్ళపై అతనిపైకివచ్చి తన మెడను అతని చేతులలో దూర్చాలి. పిమ్మట తన మోకాళ్ళపైన చేతులపైనా ప్రాకుతూ అతనిని బైటకు



ఈడ్చుకురావాలి. ఇలా ఈడ్చడంలో అతని తల నేలకి రాసుకోకుండా చూడాలి. ఇలా ఈడ్చుకు వచ్చేటపుడు పొగ ఎక్కువగావుండి గాలి పీల్చుకోవలసివచ్చినపుడు ఆగి తలక్రిందగావంచి గాలి పీల్చుకొని మళ్ళీ బయలుదేరవచ్చును.

ఈ పద్ధతివల్ల తనకన్న బరువైన మనిషినిసహితం సులువుగా రక్షించవచ్చును. గదిలోకి వెళ్ళేటప్పుడు ఒక జేబురుమాలు, కంబళి తీసికొనివెళ్ళడం మంచిది.

## 5. స్పృహలేని మనిషిని మేడమెట్లపైనుండి దింపడం

ఇలా దింపేటపుడు మెట్లు బలంగా ఉండేవైపునుండి దింపాలి. అతని తల వెనుకభాగం మెట్లవైపుకు తిప్పి కూర్చోబెట్టి తలను తన

మోచేతిలో అన్చి తన రెండుచేతులతోను అతని చంకలలో పట్టుకొని ఒక్కొక్క మెట్టే జార్చాలి. (అతని తలను గోడవైపునఉండే మోచేతిలో గాక రెండవ మోచేతిలో ఆన్చాలి.) ఇలా జార్చేటప్పుడు అలసట చెందితే తన మోకాలుపై అతని శరీరాన్నిఆన్చి కొంచెంసేపు విశ్రాంతి తీసుకో వచ్చును. ఈ పద్ధతిలో తనకన్న బరువైన మనిషిని శ్రమలేకుండా దింప వచ్చును.

## 6. స్పృహలేని మనిషిని మేడపైనుండి క్రిందికి కుర్చీముడిలో దింపడం

ఒక మోకుకు మధ్యగా కుర్చీముడివేసి ఒక కొసను మేడక్రిందికి వదలాలి. ఈ కొస క్రింద ఒక మనిషి పట్టుకొని మనిషిని దింపుతున్నపుడు అతను గోడకు కొట్టుకోకుండా దూరంగా లాగాలి. కుర్చీముడిలో స్పృహ తప్పిన మనిషిని అమర్చాలి. మోకుయొక్క పైనుండే భాగాన్ని గోడకి దగ్గరగా కాలిక్రింద ఒక మనిషి తొక్కిపట్టి చేతితో గట్టిగా పట్టుకొని ముడిలోఉన్న స్పృహతప్పిన మనిషిని కిందకు వదలాలి. కాలికింద తొక్కి పట్టిన మోకు కొంచెంకొంచెంగా వదలాలి. మనిషి క్రమంగా కిందకు వెడతాడు. ఈవిధానంలో మోకు గోడరెండువైపులా కాలికింద రాసు కొంటుంది. ఈ మూడు రాపిడిస్థలాలవల్ల మనిషిబరువు కొంతతగ్గుతుంది.

## 7. బాగా ఎత్తైన అంతస్తునుండి తప్పించుకోవడం

ఒక మోకు ఏదైనా బలమైనదానికి గట్టిగా కట్టి కిందికి వేలాడ వేయాలి. దానిని చేతికింద చెయ్యిఉంచి గట్టిగా పట్టుకొని శరీరం బిగబట్ట కుండా నిలువున వ్రేలాడాలి. ఒక కాలుకి మోకు ఒక మెలివేసి దానిని రెండు పాదాలమధ్య ఉంచుకోవాలి. పిమ్మట ఒక చెయ్యివిడచి రెండవ చేతి

క్రింద పట్టుకొంటూ కిందికి దిగాలి. జారకూడదు. జారినట్లయితే చేతుల చర్మము కొట్టుకొనిపోయి వుండుపడి మధ్యలోనే మోకును విడిచిపెట్టి కింద పడడం జరుగుతుంది.

మోకు దొరకకపోతే గట్టిబట్టలు ముడివేసి ఉపయోగించాలి.

## 8. తక్కువ ఎత్తునుండి తప్పించుకోవడం

మొదట కాళ్ళు బైటకు వేలాడవేసి కూర్చోవాలి. పిమ్మట కడుపు మీద ఆనుకొని చేతివేళ్ళతో అంచు గట్టిగా పట్టుకొని పూర్తిగా వేలాడాలి. ఇందువల్ల సుమారు అ. 7 ఎత్తు తగ్గుతుంది. ఇలా వ్రేలాడుతున్నప్పుడు శరీరాన్ని బిగబట్టకుండాఉంచి ముఖాన్ని స్వల్పంగా పక్కకు తిప్పుకొని పాదాలతో గోడ స్వల్పంగాతన్ని కాలివేళ్లమీద దూకాలి. ముఖం పక్కకి తిప్పకపోతే గోడకురాసుకొని కొట్టుకొనిపోతుంది. గోడనుతన్నడం వల్ల గోడకు స్వల్పంగా దూరంగా పడవచ్చును. వేళ్ళమీద దూకకుండా మడమలమీద దూకితే పెద్ద "షాక్" (అదురు) యిచ్చి శరీరానికి నష్టం కలుగుతుంది.

మనుష్యుల్నిగాని, ఆస్తినిగాని రక్షించడానికి వెదకడం పైఅంతస్తునుండి ప్రారంభించాలి. ఎందువల్లనంటే మంటలు మొదట పైభాగాలకి నష్టంగలుగ జేస్తాయి.

---

# 6. పేలుడు బాంబులు (పటము 25 వ పేజీలో)

## (HIGH EXPLOSIVE BOMBS)

పేలుడుబాంబులు దట్టమైన ఉక్కురేకుతో చేయబడి పేలుడు పదార్థములతో నింపబడి దేనికైనా బలంగా తాకడంతో పేలి అధికనష్టాన్ని

కలిగిస్తాయి. ఇవి వీటికి అమర్చబడిన వత్తిని (Fuse) బట్టి వేనికైనా తాకిన వెంటనేగాని, ఆలస్యంగాగాని పేలుతాయి. ఇప్పటివరకుగల అనుభవాన్ని బట్టి జర్మను పేలుడు బాంబులలో 96 గంటలకుకూడా పనిచేసే వత్తి, జపాను బాంబులలో 64 గంటలకుకూడా పనిచేసినవత్తి ఉన్నాయి. పేలుడు బాంబులలో రకాలు వాటిలో ఉపయోగించే పేలుడు పదార్థాలలో మార్పునుబట్టికాక, వాటి రేకు మందాన్నిబట్టి బరువునుబట్టి ఉంటాయి. అన్ని పేలుడు బాంబుల్లోనూ టి. ఎన్. టి. అనేదానిని పేలుడు మందుగా (High Explosive charge) జర్మనులు ఉపయోగిస్తారు. పేలుడు బాంబుల బరువు 20 పౌన్లు మొదలు 400 పౌన్లవరకు ఉంటుంది. వీటికి తోకవద్ద పిల్లంగ్రోవివంటి ఒక అరచే సాధ(Screeming Device) నాన్ని అమరుస్తారు. బాంబు వదలబడి కిందకి వచ్చేటప్పుడు ఈ సాధనం భయంకరమైన శబ్దాన్ని చేస్తుంది. ఈ శబ్దంవల్ల శరీరంలోని నాడులు తాత్కాలికంగా పనిచేయకపోవడం తటస్థించవచ్చును.

## ఉపయోగించే ఉద్దేశ్యం

మిలటరీ ప్రదేశాలను యుద్ధ కర్మాగారాలు మొదలైన కట్టడాల్ని, విమానాశ్రయాల్ని, ఓడరేవుల్ని, ఓడల్ని, రాకపోకమార్గాల్ని నాశనం చెయ్యడానికి పేలుడు బాంబుల్ని ఉపయోగిస్తారు. ఇంతేగాక ఆస్తినష్టాన్ని ప్రాణనష్టాన్ని అంగవైకల్యాలు కల్గించిన్నీ, నీటి సరఫరామార్గాలు ఎలక్ట్రిక్ మార్గాలు నష్టపర్చిన్నీ ప్రజలలో విపరీతమైన భయం పుట్టించి వారి మనోధైర్యాన్ని చెడగొట్టడానికికూడా పేలుడు బాంబుల్ని ఉపయోగిస్తారు.

ఈ బాంబులు భూమిలోనికి చొచ్చుకుపోవడం లేక గొయ్యి పడడం గాని, కట్టడాల్ని చీల్చడంగాని, వాటియొక్క బరువునుబట్టి, వదలబడిన


తోక
ప్రేలుడు మందు
ఒత్తి

ఎత్తునుబట్టి బాంబురకాన్ని దాని వత్తినిబట్టి, కిందఉండే భూమి లేక కట్టడం యొక్క స్వభావాన్నిబట్టి ఉంటుంది.

## కలిగే నష్టాలు

ఈ బాంబు పేలినపుడు విపరీతమైన శబ్దం కలుగుతుంది. ఈ శబ్దానికి చెవులలో పల్చని పొరలు (ear drums) పగిలిపోవడం బలహీనమైన గుండెలు ఆగిపోవడం సంభవించవచ్చును.

కాబట్టి ఈ పేలుడు శబ్దాన్నుండీ, బాంబుమ అమర్చబడే శబ్ద సాధనం యొక్క భయంకర శబ్దాన్నుండీ రక్షించుకోడానికి చెవులలో దూది మెత్తనైన వుంచుకొని చేతులతో చెవులు గట్టిగా మూసుకోవాలి.

## 1. విసురు (Blast)

పేలుడు బాంబులలో సుమారు 500 పౌన్లు బరువుగలది పేలినపుడు చుట్టూ వుండేగాలిలో పెద్ద ఒత్తిడితో కూడిన విసురు బయలుదేరి చుట్టూ అ. 50 దూరంలోవున్న కట్టడాల్ని నేలమట్టం చేస్తుంది. పేలడానికి ముందు బాంబులో తయారైన వాయువు బాంబుపేలగానే చుట్టూఉన్న గాలిని విపరీతమైన ఒత్తిడితో తోస్తుంది. ఈ విధంగా గాలిని తోయడం వల్లనూ, అలా తోయబడిన గాలి తిరిగి తన స్థానాన్ని ఆక్రమించుకోవడం వల్లనూ, ఈ విసురు కలుగుతుంది. విసురులో గాలియొక్క యీ రాకపోకలు విపరీతమైన ఒత్తిడితోనూ, వేగంతోనూ ఉంటాయి. ఈ విసురువల్ల కలిగే నష్టం అరనిముషంలో జరిగిపోతుంది.

కాబట్టి బాంబుపడిన స్థలానికిచుట్టూ అ. 50 దూరంలోపల రక్షణ అసాధ్యం. సుమారు అ. 7 మందంగల కాంక్రీటుదిమ్మలు అన్నివైపులా ఉండేటట్లు ఆశ్రియం నిర్మించుకుంటేగాని, లేక భూమిలో అ. 60 లోతున

గాని రక్షణ లభించవచ్చును. విసురు పరిగూదంగల ప్రదేశాన్ని "డైరెక్ట్ హిట్" అంటారు.

## 2. భూమి అదురు (Earth Pressure wave)

బాంబు పేలినపుడు భూమి అదిరి చుట్టూవున్న ఇండ్లగోడలు పునాదులతో సహితంగా ఇళ్ళుకూలడంకూడా సంభవించవచ్చును.

దీనినుండి రక్షణపొందడానికి ఇంటిచుట్టూ అ. 6 దూరంలో అం. 18 వెడల్పుగల కందకం త్రవ్వాలి. దీనిలోతు ఇంటిపునాది లోతుకన్న సుమారు అం. 6 ఎక్కువగాఉంటే సరిపోతుంది. ఈ కందకాన్ని "గార్డుట్రెంచి" అంటారు.

## 3. తునకలు (Splinters)

బాంబు పగిలినపుడు బయలుదేరే బాంబుగుల్లయొక్క ఉక్కుముక్కలే ఈ తునకలు. ఇవి తుపాకి గుళ్ళకు రెండు రెట్లు (సెకండుకు 3000 అడుగులు) వేగంతో పోతూ బాంబుపడిన ప్రదేశానికి సుమారు అ. 150 దూరంలోగల బలహీనమైన ఇళ్ళగోడల్ని సహితం కూల్చుతాయి. అడ్డులేకపోతే యీ తునకలు సుమారు 1200 గజాలదూరం పోతాయి. సుమారు 600 గజాలదూరం వరకు ప్రాణహాని కల్గించవచ్చును. ఇవి బయలుదేరిన చోటునుండి దూరం పోయినకొలదీ భూమికి ఎత్తుగా పోతూ ఉంటాయి.

పేలుడుబాంబులలో కవచబేధిని (Armour piercing), అర్థకవచబేధిని (Semi Armour piercing), సాధారణంగా అన్ని పనులకీ ఉపయోగించేది (General purpose), గొడుగునకు వేలాడదీయబడేది (Parachute land mine), మనుష్య మారణబాంబు (Anti personnel) మొదలైన రకాలున్నాయి. వీటిలో మనుష్య మారణబాంబులు అన్నిటికన్న

చిన్నవైయుండి తునకలపరిభావం ఎక్కువ కల్గి ఉంటాయి. వీటిని ప్రత్యేకంగా మనుష్యుల ప్రాణాలు బలిగొనడానికే ఉపయోగిస్తారు.

ఇటీవల జరిగిన కలకత్తా దాడులలో జపాన్ వీటినే ఎక్కువగా ప్రయోగించింది. వీటి తునకలు నేలబారుగాకూడా పోతున్నాయి.

పేలుడు బాంబుతునకలనుండి రక్షణకి ఈ దిగువ రకపు ఆశ్రయాలుండాలి.

(1) భూమిలోపల ఉన్న గదులు.

(2) అం. 12 మందంకల మద్దతుకాంక్రీటు (Reinforced concrete) గోడలుగల గదులు.

(3) అం. 15 మందంగల సాధారణ కాంక్రీటుగోడలుగల గదులు.

(4) అం. 13½ మందంగల గట్టియిటుక లేక రాతిగోడలు (1 పాలు సిమెంటు 3 పాళ్ళు సున్నం వంతున కలిపి కట్టినవి) గల గదులు.

(5) అం. 30 మందంగల పచ్చియిటుక లేక మట్టిగోడలు గల గదులు.

పైమందాలకు తక్కువ వుంటే మనం రక్షణ తీసికోవడానికి ఉపయోగించే గది (Refuge room) గోడలచుట్టూ కనీసం మరొక గోడయినా ఉండాలి; లేదా గదియొక్క బలహీనమైనగోడలు యిసుకబస్తాల గోడలచే బలపర్చాలి; లేదా ఇట్టిగది మెత్తనినేల కెదురుగా ఉండాలి.

ఇలాంటి రక్షణ గదులకు లోపల ప్రవేశించడానికి బయటకి రావడానికి రెండు గుమ్మాలుమాత్రం సరిపోతాయి. ఇంతకంటె అధికంగా ఉన్న గుమ్మాలు, కిటికీలు పూడ్చివేయడం మంచిది. ఎందుచేతనంటే గుమ్మాలు కిటికీలుగలచోట్లు గదికి బలహీనమైన స్థానాలు. రక్షణగదికి

ఉండే, ఈ రెండు ద్వారాలున్నూ, అధికంగా ఉన్న గుమ్మాలు కిటికీలు పూడ్చివేయకపోతే అవిన్నీ, ఇంట్లోవుండే యితరగోడలవల్లగాని, లేదా ప్రత్యేకంగా నిర్మించిన యిసుకబస్తాల గోడలు, లేక యిటుకగోడల (Traverse walls) వల్లగాని రక్షింపబడాలి. రాకపోకలకు ఉపయోగించే రెండు ద్వారాలకు దట్టమైన దుప్పట్లు ఏర్పాటుచేయాలి. ఇవి వ్రేలాడేటపుడు గోడలను పూర్తిగా ఆనుకొని ఖాళీలు లేకుండా ఉండాలి. వీటిని దాడి హెచ్చరిక వినగానే ఉప్పునీళ్ళతో తడిపిఉంచాలి. విషవాయువు ప్రయోగించబడినదని హెచ్చరిక యివ్వగానే ఈదుప్పట్లను దించాలి. ఈదుప్పట్లవల్ల విషవాయువు రక్షణగదుల్లో ప్రవేశించలేదు.

రక్షణగది పైకప్పు మంటల బాంబులచే చీల్చబడనిదిగా (18వ పేజీ చూడుము) ఉండాలి.

రక్షణగదిలో ఆహారం, నీరు నిలవ వుంచుకోవాలి. ప్రాణ వాయువును ఖర్చుచేయని దీపాలు (బ్యాటరీలైట్లు మొదలైనవి) ఉంచుకోవాలి. మంటలనార్పే సాధనాలు, గడ్డపలుగు పార (ఇంటి యితరభాగాలు కూలి గదిగుమ్మాని కడ్డంగా పడితే తొలగించడానికి) ప్రథమ చికిత్స పరికరాలు కూడా జాగ్రత్త పెట్టుకోవాలి. శరీరానికి శ్రమ కలుగని వినోదాలుండాలి. రక్షణగదులలో మనిషికి సుమారు 4 చ. అ. స్థలంవుండాలి. వాటిలో చెవులు మూసుకొని గోడల సమీపంలో వాటికెదురుగా కూర్చోవాలి. గోడలకు ఆనుకోకూడదు.

## కార్మికుల ఇళ్ళవద్ద - పల్లెలలో

కార్మికుల ఇళ్ళల్లోనూ, పల్లెలలోనూ పై రకపు గదులు దొరకడం దుర్లభం. కాబట్టి అట్టిచోట్ల ఇండ్లకు కొంచెం దూరంలో (ఇళ్ళు కూలితే వాటిపై పడకుండా యింటికి రక్షణస్థానానికి మధ్య ఇంటిఎత్తులో కనీసం

సగం దూరముండాలి) కందకాశ్రియాలు (Trench shelters) నిర్మించాలి. ఇవి భూమిలో అ. 6 లోతున అ. 2 వెడల్పున ఉండాలి. వీటి పొడవు అ. 25 మించి ఉండకూడదు. వీటిగోడలు ఇటుక కట్టడంలోనో, ఇనుపరేకులతోనో బల్లకూర్పుతోనో, కనీసం వెదురు అల్లికతోనో బలపర్చాలి. ఇది అదురుకు పడిపోకుండా అడ్డగోడలో, అడ్డ దూలాలో ఏర్పరచడం మంచిది. ఇట్టి విధంగా ఉండే కందకంమీద ఇనపరేకులో, బల్లలో, చెట్లకొమ్మలో దగ్గరగాపేర్చి వాటిపై సుమారు అం. 18 మందాన్ని మట్టి పోయాలి. అప్పుడే ఇది కందకాశ్రియం అవుతుంది. దీనిలో ప్రవేశించడానికి ఏటవాలుగా రెండుచివరలను తోవలు చేయాలి. ఈ తోవల గుండా విషవాయువు ప్రవేశించకుండా రక్షణగది కేర్పరచినట్లే దుప్పట్లు ఏర్పరచవచ్చును. వీటిలోకూడ మనిషికి 4 చ. అ. స్థలం ఉండాలి. గోడలను ఆనుకోకుండా కూర్చోడానికిగాను ద్వారాలకెదురుగా చెవులు మూసికొని కూర్చోవాలి.

కందకాలంటే (Slit trenches) పైన కప్పులేనివి. వీటిని చెట్లకింద తవ్వాలి. వీటిలోతు అ. 4½ ఉంటే చాలు. వెడల్పు అ. 2 ఉండాలి. ఇది "V", "W", "Z" ఆకారాలతో త్రవ్వవచ్చు. కాని ప్రతి ఒక్క భుజం (ఒకే పొడవుగల భాగం) అ. 8 మించి ఉండకూడదు. వీటి గోడలుకూడా కందకాశ్రియం గోడల్లాగే బలపర్చాలి. వీటిలోకూడా గోడలకి ఆనుకోకుండా చెవులు మూసుకొని కూర్చోవాలి. నోరుకూడా తెరచియుంచాలి.

పైన చెప్పినవేకాక మదతు కాంక్రీటు పైపులు, కాంక్రీటు నూతి వరలు, 50 గాలన్ల ఆయిలు డ్రమ్ములు భూమిలో పాతి వాటిలో రక్షణ తీసికోవచ్చును. రోడ్ల వంతెనలకిందా, కొండ గుహల్లోనూ కూడా మంచి రక్షణ దొరుకుతుంది. వీటన్నిటిలోకూడా గోడలను ఆనుకోకుండా చెవులు గట్టిగా మూసుకొనే కూర్చోవాలి.



పైన చెప్పిన ఆశ్రియాలన్ని వాటిలో రక్షణ తీసికొనేవారు మూడు నిముషములలో చేరగలిగే దూరంలో మాత్రమే ఉండాలి.

పైన చెప్పిన ఆశ్రియాలేవీ దొరకనపుడు బోర్లపడుకోవాలి. శరీరం బిగబట్టకూడదు. తల రొమ్ము భూమిపై ఆన్చకుండా, మోచేతులపై ఆని

అరచేతులతో చెవులు మూసుకోవాలి. తల సాధ్యమైనంత కిందుగా ఉంచాలి. కంటి అద్దాలు, టోపీ మొదలైనవి ఉంటే తీసివెయ్యాలి. కళ్లు ముయ్యడం మంచిది. నోరు తెరచి ఉంచడానికిగాను పళ్ళమధ్య గుడ్డ చుట్టగాని, కర్రముక్కగాని లేక ఏది దొరికితే అది ఉంచుకోవాలి. మెత్తని ప్రదేశంలో పడుకోవడం మంచిది. పల్లపు ప్రదేశంలోగాని, గుట్ట, గోడ మొదలైన వాటి చాటునగాని పడుకోవడంవల్ల నేలబారుగా పోయే జనాను మనుష్యమారణ బాంబు తునకలనుండి సహితం రక్షణ కలుగుతుంది.

# 7. పేలని బాంబులనుండి రక్షణ

కిందపడి పేలకుండాఉన్న పేలుడు బాంబులు పేలడానికి అవకాశం ఉన్నంతకాలం (జర్మన్ బాంబులు 96 గంటలు, జపాన్ బాంబులు సుమారు 64 గంటలు) పేలని బాంబులు (unexploded bombs) అనబడతాయి. అటుపిమ్మట ఇంతవరకుగల అనుభవాన్నిబట్టి అవి పనిచెయ్యని (Dud Bombs) వని చెప్పవచ్చును.

## తీసికోవలసిన జాగ్రత్తలు

1. పేలనిబాంబు బహిరంగ ప్రదేశంలో భూమిమీదఉంటే చుట్టూ 300 గజాల స్థలం; భూమి లోపలికిపోతే చుట్టూ 100 గజాలస్థలం (భూమిలో రంధ్రంవల్ల పేలనిబాంబు ఉన్నదని తెలిసికొనేట్లయితే, 6 అంగుళాలకి తక్కువ వ్యాసంగల రంధ్రం పేలుడు బాంబువల్ల చేయబడినది కాదని గుర్తుంచుకోవాలి); ఇళ్లుగలచోట్ల రోడ్డుమీద ఉంటే బాంబు రెండువైపులా రోడ్డుమీద 100 గజాలదూరంలోనూ, రోడ్డుకు రెండువైపులా 30 గజాల దూరంలోగల ఇళ్లు ఖాళీచేయాలి. ఆ ఇళ్ళ కిటికీలు ద్వారాలు తెరచి ఉంచాలి.

2. ఆ ప్రదేశంమీదుగా రాకపోకలు ఆపుచేయాలి.

3. పేలని బాంబున్న ప్రదేశాన్ని గుర్తించుకొని, వాలంటీర్లు లేక ఎ. ఆర్. పి. వార్డెన్లద్వారా, ఎ. ఆర్. పి. కంట్రోలరుకు తెలియ చేయాలి.

పేలనిబాంబులు పేలే కాలం దాటినపిమ్మట తిరిగి ఇండ్లలో ప్రవేశించవచ్చును.

---

# 8. విషవాయువులు

## (POISON GASES)

ప్రాణాపాయాలూ, గాయాలూ, కలుగచెయ్యడానికీ, ఆహారాన్ని నీటిని ఇతర అన్ని వస్తువుల్ని విషపూరితం చెయ్యడానికి, ఉపయోగించబడే రసాయనపదార్థాలే విషవాయువులు. ఇవి గాలికన్న బరువగుటచేత భూమిని అంటి వ్యాపిస్తాయి. వీటిని వాయు, ఘన, ద్రవ రూపాల్లో ఉపయోగించ వచ్చును. ఘనరూపంలో చిన్న అణువులుగాఉండి క్రమంగా గాలిలో కలిసి పోతాయి. ద్రవరూపంలో బాంబులలో ఉంచిగాని, ఆటవస్తువులు నిత్య జీవితంలో ఉపయోగపడే వస్తువుల్లో ఉంచిగాని వీటిని ఉపయోగించ వచ్చును. లేక విమానాలనుండి వర్షంమాదిరిగ జల్లవచ్చును. ద్రవరూపంలో ఉన్న విషవాయువు నేలపైబడి చిక్కని నూనెలాగున ఉండి క్రమంగా వాయురూపం చెందుతూ గాలిలోకలుస్తూ ఉంటుంది. ఈవిధంగా చాలా రోజులవరకు గాలిని చెరుచుతూ ఉంటుంది.

విషవాయువులపై వాతావరణ ప్రభావం చాలా హెచ్చుగా ఉంటుంది. విశేషంగా ఎండలు, వర్షాలు, పెద్దగాలులు ఉండేచోట్ల, బహిరంగ

ప్రదేశాలలోనూ విషవాయువులు బాగా పనిచేయవు. వీటిని ఉపయోగించడానికి బాగా ఎండలు, వర్షాలు, గాలులులేని సమయాలు, చల్లనిరాత్రులు, సంధ్యాసమయాలు, జనసమ్మర్ధముగలచోట్లు అనుకూలమైనవి.

రెస్పిరేటర్లు (విషవాయువునుండి రక్షించుకోడానికి ముఖానికి తొడుగుకొనే సాధనాలు) విషవాయు రక్షణదుస్తులు, విషవాయువులనుండి రక్షణ నిస్తాయి. ఇవి లేనప్పుడు విషవాయుచే ఆవరింపబడిన ప్రదేశంలో చిక్కుకున్న యెడల ఏదైనా గుడ్డను బాగా మడతలుపెట్టి దానితో ముక్కును నోటిని గట్టిగా మూసుకొని గాలి కెదురుగా పరుగెత్తుతూ, సాధ్యమైనంత దగ్గరలోఉన్న పక్కసందులగుండా దూరంగా పోయినట్లయితే బయటపడ వచ్చును. పిమ్మట ప్రథమ చికిత్సపొంది అవసరమైతే డాక్టరువద్దకు పోవాలి.

ద్రవరూపంలోఉన్న విషవాయువును నీరు పోయించి కడిగివేయ వచ్చును. పెట్రోలు బ్లీచింగ్ పౌడరు మొదలైనవి దానిపైవేసిగాని, లేక ఎండుగడ్డి, తాటాకులు మొదలైనవి దానిపైవేసి తగలబెట్టడంవల్లగాని, లేక మట్టితో కప్పివేయడంవల్లగాని నాశనం చేయవచ్చును.

శరీరంపై వాటి ఫలితాలనుబట్టి విషవాయువుల్ని యీ దిగువరీతిగా విభజించవచ్చును.

## 1. కన్నీళ్ళు పుట్టించేవి (Tear gases)

ఇవి కళ్ళకు తగిలినప్పుడు రెప్పలకు మంటలు, దురదలుపుట్టి కళ్ళ వెంబడి నీరు విశేషంగా కారుతూ కళ్ళు మూసుకుపోతాయి. ఈ వాయువు గల ప్రదేశాన్నుండి బయటపడిన తర్వాత యీ బాధలు పోతాయి. పిమ్మట కళ్ళను ఉప్పునీళ్ళతో కడగడం మంచిది.

## 2. తుమ్ములు పుట్టించేవి (Sneezin gases)

ఇవి పీలిస్తే ముక్కు, నోరు, గొంతు, రొమ్ములలో నొప్పులు కలుగుతాయి. విపరీతంగా తుమ్ములు వస్తాయి. ఎక్కువగా పీలిస్తే వాంతులుకూడా పుడతాయి. (పీల్చిన కొన్ని నిముషాలవరకు యీ లక్షణాలు కనబడక పోవచ్చును.) ఈ వాయువుగల ప్రదేశంనుండి బయటపడినపిమ్మట 20 వంతులనీళ్ళలో 1 వంతు సోడాఉప్పు కలిపి గొంతు, నోరు, ముక్కు శుభ్రంగా కడిగితే బాధలు పోతాయి.

## 3. ఊపిరాడకుండా చేసేవి (Choking gases)

(అ) ఇవి పీల్చినట్లయితే దగ్గు వస్తుంది. రొమ్ములో పెద్ద నొప్పి కలుగుతుంది. క్రమంగా కొంతసేపటికి ఊపిరితిత్తులుచెడి మరణం సంభవిస్తుంది. వీటిలో 'ఫాస్జెన్' అనే వాయువు పీల్చినపుడు పైన చెప్పిన లక్షణాలు ప్రారంభమయి పిమ్మట ఆగిపోయి కొన్నిగంటల తర్వాత మళ్ళీ కనపడి అకస్మాత్తుగా మరణం సంభవిస్తుంది.

(ఆ) మరికొన్ని విషవాయువులుపీలిస్తే తలనొప్పి, డోకు, అసహ్యం పుట్టి, వీపుమీద, పొట్టలోను, కీళ్ళలోను నొప్పులు కలుగుతాయి. మూత్రపిండాలు, కాలేయం, రక్తం చెడి మరణం కలుగుతుంది.

(ఇ) మరొకరకం విషవాయువు పీలిస్తే ఊపిరితిత్తులు, మెదడు, హృదయంచెడి "ఫిట్సు" వస్తాయి. నాడీమండలం పూర్తిగాచెడి పక్షవాతం వచ్చినట్లు శరీరంలోని అవయవాలు పనిచెయ్యవు. కొంతసేపటికి మరణం సంభవిస్తుంది.

పై మూడురకాల ప్రాణాపాయం కలుగజేసే విషవాయువులు పీల్చిన వారికి విశ్రాంతి, మంచిగాలి, వెచ్చదనం కావాలి. (వెచ్చదనానికి కంబళి

కప్పాలి.) వేడిగాను, తీపిగాను ఉండే "టీ" ఇవ్వవచ్చును. పిమ్మట ఎంత మాత్రం ఆలస్యం చెయ్యకుండా, రోగిని కదల్చకుండా ("స్ట్రెచరు" మీద గాని లేక మంచంమీద గాని) డాక్టరువద్దకు తీసుకుపోవాలి.

## 4. చర్మాన్ని బొబ్బలెక్కించేవి (Blister gases)

ఇవి ద్రవరూపంలోగాని, వాయురూపంలోగాని శరీరానికి తగిలినట్లయితే చర్మం ఎర్రబడి దురద మంటపుట్టి సుమారు 12 గంటల తర్వాత బొబ్బ ఎక్కుతుంది. క్రమంగా బొబ్బచితికి పుండై చాలాకాలం బాధిస్తుంది. రక్తం చెడుతుంది. ఈ వాయువులు బట్టలు, చెప్పులు మొదలైన వాటిగుండా కూడా పోయి శరీరానికి నష్టం కలుగచేస్తాయి. ఈ వాయువు శరీరానికి తగిలినట్లయితే బట్టలు చెప్పులు మొదలైనవాటిని వెంటనే తొలగించి ఎర్రబడిన ప్రదేశాలన్నింటినీ బొబ్బ ఎక్కకపూర్వమే శుభ్రమైన గుడ్డను బాగా మడతలుపెట్టి గట్టిగా నొక్కి తుడవాలి. (ఇట్లు తుడిచిన గుడ్డలు శరీరంలో యితరచోట్ల తగలకూడదు.) పిమ్మట సబ్బునీటితో శుభ్రంగా కడిగి డాక్టరువద్దకు పోవాలి.

విషవాయువుల్ని శత్రువులు సువాసనలతో కూడా ప్రయోగించడం వల్ల వాసనలనుబట్టి గుర్తించుట కష్టమవుతోంది. కాబట్టి దాడుల సమయములో ఏమాత్రం కొత్తవాసన కలిగినా విషవాయువుగా గ్రహించి జాగ్రత్త పడడం మంచిది.

---

# 9. హెచ్చరికలు

## (WARNINGS)

దూరదర్శనులు (Telescopes), సెర్చిలైట్లు, శబ్దగ్రహణ యంత్రాలు (Radio Detectors) మొదలైన వాటిద్వారా కొన్ని ప్రత్యేకించబడిన

దళాలు (Indian observor corps) శత్రువిమానాల గమనాన్ని కని పెట్టి "సివిల్" "మిలటరీ" అధికారులకు తెలియచేస్తాయి.

ప్రభుత్వ ఎ. ఆర్. పి. సంస్థలుగల పట్టణాలలో ఎ. ఆర్. పి. కంట్రోలరు శత్రువిమాన రాకపోకల హెచ్చరికలను ప్రజలకు తెలియ జేస్తాడు.

## 1. దాడి హెచ్చరిక (Air Raid warning or Red Message)

ఇది దాడికి సుమారు 5 నిముషాల ముందుగా "సైరను" కూతల ద్వారా ప్రజలకు తెలియచేస్తారు. ఈ కూత మొదట కొంతసేపు ఒకే స్థాయిలోఉండి పిమ్మట హెచ్చుతగ్గు స్థాయిల్లో ఉంటుంది. ఈ హెచ్చరిక వినబడగానే ప్రజలందరు తమ రక్షణస్థానాల్లోకి పోవాలి.

## 2. విడుపు హెచ్చరిక (All clear or white message)

దాడి అయిపోయి శత్రువిమానాలు వెళ్లిపోయి తిరిగి వెంటనే వచ్చే అవకాశం లేదనుకున్నపుడు ఈ హెచ్చరికను సైరనుకూతల ద్వారా ప్రజలకు తెలియచేస్తారు. కాని ఈకూత మొదటినుండి చివరవరకు ఒకేస్థాయిలో ఉంటుంది. ఇది వినబడగానే ప్రజలు ఆశ్రయాలనుండి బయటకువచ్చి తమ పనులు చూసుకోవచ్చును.

## 3. విషవాయు హెచ్చరిక (Gas warning)

ఏ ప్రదేశంలో విషవాయువుంటే అచటివారెను "హేన్డ్ రేటిల్" (పక్షుల్ని ముట్టిఎత్తుకోనేటపుడు ఉపయోగించే కర్రసాధనం. దీనిశబ్దం చాలా దూరం వినబడుతుంది) తో ఈ హెచ్చరికను ప్రజలకు తెలియచేస్తాడు.

ఈ హెచ్చరిక విన్నపుడు గాలి వాలులో ఉన్న వార్డెనులందరూ కూడా యీ హెచ్చరిక యివ్వాలి.

ఎ. ఆర్. పి. వార్డెనులు దాడి హెచ్చరికను "విజిల్సు"తోనూ, విడుపు హెచ్చరికను చేతి గంటలతోనూ యిస్తారు.

పల్లెలలోనూ, ప్రభుత్వ ఎ. ఆర్. పి. సంస్థలులేని పట్టణాలలోనూ ప్రజారక్షణ కమిటీల తరఫున పనిచేసే ఎ. ఆర్. పి. దళ సభ్యులే ఈ హెచ్చరిక లివ్వాలి. ఇట్టిచోట్ల దాడి హెచ్చరిక బాగా శబ్దం ఇచ్చే కొమ్ము బూరలు లేక ఇతర సాధనాలతోగాని, కనీసం "విజిల్సు"తోగాని యివ్వాలి. విడుపు హెచ్చరికకు గంటలు, విషవాయు హెచ్చరికకు "హేన్డ్ కేటిల్సు" ఉపయోగించవచ్చు.

ఇట్టిచోట్ల శత్రువిమానాల గమనాన్ని తెలుసుకోడానికి డ్యూటీల ప్రకారం ఎల్లప్పుడూ ఒక ఎ. ఆర్. పి. దళసభ్యుడు ఎత్తైన ప్రదేశంమీద ఉండాలి.

# 10. వెలుతురును మరుగుపరచుట

## (OBSCURATION OF LIGHT)

### అవశ్యకత

దీపాల కాంతివల్ల పట్టణాలపై అస్పష్టమైన వెలుతురు సుమారు 30, 40 మైళ్ళవరకూ కనబడుతుంది. అందువల్ల శత్రు విమానాలు దూరం నుండే యుద్ధ లక్ష్యాలను గుర్తించగలవు. దీపాలు మరుగుపరచినట్లయితే శత్రువులు అంత తేలికగా దూరంనుంచే యుద్ధ లక్ష్యాలను గుర్తించలేక

కొంతవరకు పగలే దాడులు చెయ్యవలసివస్తుంది. పగటిదాడుల్లో ప్రజలకు ప్రమాదాలు తప్పకుండా ఉంటాయి. ప్రజలందరి సహకారంతోనే దీపాలు మరుగుపర్చడం సక్రమంగా అమలు జరుగుతుంది. ఇది దేశం యొక్క సమాజంయొక్క క్షేమానికి అత్యవసరమని, ఇది వ్యక్తిగతమైన విషయంకాదని అందరూ గుర్తించాలి.

వెలుతురును మరుగుపర్చడంలో "బ్రౌనౌటు" "బ్లాకవుటు" అని రెండు రకాలున్నాయి.

## 1. బ్రౌనౌటు

ఈ పద్ధతిలో దీపాన్నుండి తిన్నని కిరణాలుగాని ప్రతిబింబించిన కిరణాలుగాని ఇండ్లబయటపడరాదు. ఇట్లుచేయడానికి రంగు "బల్బులు" లేక రంగు "డోములు" ఉపయోగించవచ్చును. లేకపోతే రేకులతోగాని, అట్టలతోగాని, బల్బులచుట్టూ "షేడ్లు" ఏర్పరచవచ్చును. ఈ "షేడ్" బల్బుయొక్క వ్యాసానికి రెండురెట్లను మించని వ్యాసంగలిగి, బల్బు యొక్క పొడవుకు రెండు రెట్లకు తగ్గని పొడవుకల్గి ఉండాలి. చేతిలాంతర్లకు రంగు చిమ్నీలు ఉపయోగించవచ్చును. పై పద్ధతులు అవలంబించకపోతే కిటికీలకు, గుమ్మాలకు రంగుగుడ్డల తెరలు ఉపయోగించినా సరిపోతుంది.

ఇండ్లకుఉండే బయటిదీపాలు అన్నీ పూర్తిగా తొలగించాలి.

బండ్లు, సైకిళ్ళు, బ్యాటరీలైట్లు మొదలైనవాటి అద్దాలకుకూడా రంగుకాగితం అంటించాలి. కారులైట్ల అద్దాలకు లోపలివైపున పూర్తిగాను, పైవైపున పైసగం భాగంలోనూ దట్టమైన రంగు కాగితం అంటించాలి.

## 2. బ్లాక్ అవుటు

ఈ పద్ధతిలో ఇండ్లబయట వెల్తురే కనబడకూడదు. ఇట్లు చేయడానికి గుమ్మాలు, కిటికీలు పూర్తిగా ముయ్యవచ్చును. లేదా దీపాలు పూర్తిగా ఆర్పివేయవచ్చును. లేదా రంగు "బల్బులు" గాని, "డోములు" గాని, "షేడ్"లుగాని (చేతిలాంతర్లకు రంగుచిమ్నీలు) ఉపయోగించి మరొక రంగులోఉన్న తెరలు గుమ్మాలవద్ద, కిటికీలవద్ద ఉపయోగించవచ్చును.

శాంతిసమయాలలో బళ్ళు, కార్లు మొదలైనవాటి దీపాలకు "బ్లాక వుటు"లోకూడా "బ్రౌనౌటు" సరిపోతుంది. కాని దాడి హెచ్చరిక వినగానే దీపాలు పూర్తిగాఆపి రోడ్డుప్రక్కలకు వాటిని తొలగించి వాటిలో ఉన్నవారు రక్షణ చూసుకోవాలి. బళ్ళయితే యెడ్లను, గుర్రాలను చక్రాలకు గట్టిగా కట్టాలి.

---

# 11. జంతువుల రక్షణ

జంతు ప్రదర్శనశాలల్లోఉన్న క్రూరజంతువుల్ని దాడులకుపూర్వమే చంపివేయాలి. ఆవులు, గేదెలు, ఎడ్లు, గుర్రాలు మొదలైన పెంపుడు జంతువుల్ని పల్లెలకు పంపివేయాలి; లేదా పట్టణ సమీపంలోఉన్న తోటలలో ఉంచడం మంచిది. లేకపోతే వాటి రక్షణకుకూడా రక్షణగదులు ఏర్పరచాలి. ఇవన్నీ సాధ్యంకాకపోతే దాడి హెచ్చరిక వినబడగానే వీటిని ఇండ్లబయట ఉండే చెట్లకుగాని, లాంతరు స్తంభాలకుగాని గట్టిగా కట్టి వేయాలి. దాడులరోజుల్లో వీటిని మేతకుగాని, నీటికిగాని బయటకి వదల కూడదు.

అంటుకొన్న ఇళ్ళలో చిక్కుకొన్న జంతువుల్ని, వాటి కళ్ళను, వాటి చెవులతో నేమూసి, తాడుతో బయటికి తీసుకురావాలి.

గాయాలు తగిలిన జంతువులకు వెంటనే చికిత్స చేయించాలి.

---

# 12. ఖాళీ చేయుట

## ( EVACUATION )

ఒక ప్రదేశాన్ని మిలటరీ ప్రయోజనాల నిమిత్తం ఖాళీ చేయవలసివచ్చినపుడుగాని, లేక దాడులకు పూర్వమే అనవసర ప్రజలను ఖాళీ చేయించవలసి వచ్చినపుడుగాని, లేక దాడుల అనంతరం ఇళ్లు మొదలైనవి కూలిపోయినపుడు వాటిలో నివసించేవారిని ఖాళీ చేయించేటప్పుడుగాని యీ దిగువ విషయాలను గుర్తుంచుకోవాలి.

1. (అ) ఖాళీచేసి వెళ్ళేవారికి, వారు అక్కడ విడిచిపెట్టి వెళ్ళే ఆస్తికి ప్రతిఫలం ఇప్పించాలి.

(ఆ) ఇళ్లల్లో పనిచెయ్యడం, మూటలు మొయ్యటం మొదలైన పనులుచేసి ఏ రోజుకూలీ ఆరోజు సంపాదించుకొనేవారిని కూలి దొరికే చోట్లకే పంపాలి. వీరికి ప్రభుత్వంచేత కనీసం ఒక నెల భత్యం అయినా యిప్పించాలి.

(ఇ) ప్రభుత్వేతర ఉద్యోగాలు చేసుకొని జీవించేవారికి కనీసం మూడు నెలల జీతమైనా వారి యజమానులచేత అడ్వాన్సుగా ఇప్పించాలి.

(ఈ) ప్రభుత్వ ఉద్యోగస్తులకూ, అత్యవసరసర్వీసుల (Essential services) లో పనిచేసేవారికి, వారి భార్యా బిడ్డలను ఖాళీ చేయించ

డానికి కనీసం మూడు నెలల జీతమైనా అడ్వాన్సుగా యిప్పించాలి. వీరు రెండు కాపరాలు పెట్టవలసివస్తుంది గనుక వారికి ప్రత్యేక కుటుంబ అల వెన్సులు యిప్పించాలి. లేదా ఆ యా పనులలో ఉండేవారికి వారి ఖర్చు లేకుండా తిండి బట్టలు మొదలైన జీవితావసర సౌకర్యాలు ఏర్పాటు చేయించాలి.

2. ఖాళీచేసి వెళ్ళేవారు ఎక్కడికి వెళ్ళవలసినదీ ముందే నిర్ణయించాలి. కొందరు తమ బంధువులుగలచోటికో స్వగ్రామాలకో వెళ్ళడానికి ఇష్టపడతారు. కొందరు తమ ఉద్యోగసంస్థలు ఎక్కడికి మారుస్తే అక్కడికి వెళ్ళడానికి ఇష్టపడతారు. మరికొందరు ఎక్కడ వారికి తిండి దొరికితే అక్కడికి వెళ్ళడానికి ఇష్టపడతారు.

3. ఒక ప్రదేశం ప్రమాదానికి గురి అవుతుందనుకొన్నప్పుడు అచటి విద్యాసంస్థలు (స్కూళ్లు, కాలేజీలు మొదలైనవి), ఫ్యాక్టరీలు, బేంకులు మొదలైనవాటిని క్షేమంగా ఉండే మరోచోటికి మార్చడానికి ఆ యా సంస్థల యజమానులచేత ముందుగానే ఏర్పాటు చేయించాలి.

4. ఖాళీ చేయవలసిన ప్రదేశంలోగల కార్లు, బస్సులు, లారీలు, బళ్ళు, పడవలు మొదలైనవాటి నన్నిటిని తాత్కాలికంగా స్వాధీనం చేసుకొని వాటిని ఖాళీ చేయించడానికి ఉపయోగించాలి.

5. ఖాళీచేసేవారందరికి తోవలో ప్రతిపూట భోజనాది సౌకర్యాలు ఏర్పాటు చేయించాలి.

6. ఖాళీ చేయించడానికిముందు ప్రతియింట్లోనూగల పిల్లలు, వారి తల్లులు, గర్భిణీ స్త్రీలు, టీచర్లు, రోగులు, ముసలి వంటి గుడ్డి మొదలగు అశక్తులు ఎంతెంతమంది ఉన్నారో తెలుసుకొని యీ దిగువ పద్ధతి ప్రకారం వారిని పంపాలి.

మొదటిసారి పిల్లల్ని వారి తల్లుల్ని గర్భిణీస్త్రీలని పంపాలి. రెండవ సారి టీచర్లను రోగుల్ని పంపాలి. ఆఖరున నిరుపయోగులు అశక్తులుఅయిన ఇంటి గుడ్డి ముసలివారలను పంపాలి.

ఇట్లు ఖాళీ చేయించేటప్పుడు ఉద్యోగాల్లో ఉండు భర్తలను విడిచి భార్యలు, కొడుకులను విడిచి ముసలి తల్లి తండ్రులు వెళ్ళడానికి నిరాకరిస్తారు. వారికి వారి భర్తలు, బిడ్డలు, వారి వారిని రక్షించడానికి ప్రమాద సమయాల్లో వారి జీవితాలను ఎట్లా కోల్పోవలసివస్తుందో; వారొక్కరే అయితే ఎంత తేలికగా ప్రమాదంలోనుంచి తప్పించుకోడానికి అవకాశం ఉంటుందో నచ్చచెప్పి వారిని పంపాలి. పై పనులు నెరవేర్చడానికి ప్రజా రక్షణ కమిటీ ప్రజా ప్రతినిధులతో కూడిన ఒక ప్రత్యేక కమిటీని నియమించి పని చేయించాలి.

---

# 13. ఆర్గనైజేషన్

విమాన దాడులవల్ల కలిగేనష్టాన్ని తగ్గించేటందుకు పనిచేయడానికి దాడులకు పూర్వమే ఏర్పరచబడిన ఒక ఆర్గనైజేషన్ అవసరమైయున్నది. ఇట్టి ఆర్గనైజేషన్‌వల్ల, నష్టాలుతగ్గి ప్రజల నిత్యజీవితం సక్రమంగా నడిచే అవకాశం ఉందిగాన ప్రజల మనోధైర్యం చెడకుండా ఉంటుంది.

## దాడులకుముందు తీసికోవలసిన జాగ్రత్తలు

(1) హెచ్చరికలిచ్చే యేర్పాటులు (2) రక్షణాశ్రయాలు ఏర్పాటు చేసుకోవడం (3) కట్టడాల విషయంలో జాగ్రత్తలు (4) శత్రువు గుర్తించ లేకుండా కట్టడాలకు మారురంగు (మట్టిరంగు, జేగురురంగు, ఆకుపచ్చ రంగు ఆయా చుట్టుపట్ల ప్రదేశాన్ని బట్టి) పూయడం (5) హెచ్చరిక వినగానే

# ఎ. ఆర్. పి. ఆర్గనైజేషనులో ముఖ్యమైన సర్వీసులు

- కంట్రోలరు
  - వార్డెన్స్ సర్వీస్
  - ఫైర్ ఫైటింగ్ సర్వీస్
    - స్టిరప్ పంపు పార్టీలు
    - ఫైర్ వాచర్లు
    - ట్రెయిలర్ పంపు పార్టీలు
  - రెస్క్యూ సర్వీస్
    - లైట్ రెస్క్యూ పార్టీలు
    - హెవీ రెస్క్యూ పార్టీలు
  - మెడికల్ సర్వీస్
    - ఫస్టుఎయిడ్ పోస్టులు
    - ఆంబ్యులెన్సులు స్ట్రెచర్ పార్టీలు
    - ఫస్టుఎయిడ్ పార్టీలు
  - కమ్యూనికేషన్ సర్వీస్
    - మెసెంజర్లు

గుంపులుగా ఉండకుండా చెదరిపోయి రక్షణ తీసికోవడం (6) వెలుతురు మరుగు పరచడం (7) దాడి జాగ్రత్తలను గురించిన ప్రచారం చెయ్యడం (8) ఖాళీచెయ్యడం (9) మంటలనార్పే పరికరాలు, రక్షణ పరికరాలు, ప్రథమ చికిత్స పరికరాలు జాగ్రత్త పెట్టుకొని వాటి నుపయోగించడంలో శిక్షణపొంది ఉండడం మొదలైనవి.

ఈ పై జాగ్రత్తల విషయంలో సరియైన యేర్పాట్లు చేస్తే దాడుల వలన నష్టాలు తగ్గుతాయి.

## సుమారు 96,000 జనాభాగల పట్టణంలో

## వార్డెన్ను సర్వీస్




పోస్టులో ఉండే వార్డెనులు, సెక్టరు వార్డెనులు జీతాలు తీసుకొనే వారయితే "స్టాఫ్ వార్డెను"లని అంటారు. "స్టాఫ్ ఆఫీసరు"కూడా జీతం తీసికొని ఛీఫ్ వార్డెనుకు సెక్రెటరీగా పనిచేస్తాడు. ఛీఫ్ వార్డెను, డెప్యూటీ ఛీఫ్ వార్డెను, గ్రూపువార్డెనులు సాధారణంగా గౌరవోద్యోగులై ఉంటారు.

# దాడుల సమయంలో పనిచేసే సర్వీసులు

## 1. వార్డెన్సు సర్వీసు

ఇది ఎ. ఆర్. పి. ఆర్గనైజేషనుకు వెన్నెముకవంటిది. వార్డెనులే ప్రజలకు, ఎ. ఆర్. పి. ఆర్గనైజేషనుకు సంబంధము ఏర్పరచేవారు. వీరు సర్వగుణ సంపన్నులు, సమర్ధులు అయివుండాలి.

వీరికి కావలసిన పరికరాలు (1) ఉక్కుటోపీ (2) ఈల (whiste) (3) టార్చిలైటు (4) బేడ్జి (5) నోటు పుస్తకం మొదలైనవి.

## వార్డెన్సుపోస్టు

ఎ. ఆర్. పి. ఆర్గనైజేషనుగల ప్రతిపట్టణం సుమారు 2000 జనాభాగల ప్రదేశాలుగా విభజింపబడి ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క వార్డెన్సుపోస్టు ఏర్పరుస్తారు. వార్డెనులు ఈ పోస్టులలోవుండి వాటికి సంబంధించిన ప్రదేశాలలో తమ విధులు నెరవేరుస్తారు. ఈ పోస్టులలో స్టిరప్ పంపులు, నీటితో బకెట్టులు, ఇసుకబస్తాలు. మొదలైన మంటలనార్పే సాధనాలు; ప్రథమ చికిత్స పరికరాలు; టెలిఫోన్ కనెక్షను (మెసెంజర్లు); దినచర్య వ్రాయడానికి ఒక పుస్తకం (Diary); హెచ్చరిక లివ్వడానికి గంటలు, "హేన్డ్‌రేటిల్సు" ఉండాలి.

## వార్డెనుయొక్క విధులు

శాంతిసమయంలో (1) తన ప్రదేశానికి సంబంధించిన ఒక పటాన్ని (వీధులు, ఇళ్లు, ప్రమాద ప్రదేశాలు మొదలైన) వివరాలతో తయారు చేసుకోవాలి. (2) తన ప్రదేశంలో నివసించేవారితో పరిచయం చేసుకొని ప్రతి యింట్లోనూ, పగలు, రాత్రి ఉండేవారి సంఖ్య తెలిసియుండాలి. (3) టెలిఫోనులుఉండే ఇళ్లు, వాటి నంబర్లు తెలిసియుండాలి. (4) డాక్టర్లు నర్సులు ఉండే స్థలాలు తెలిసిఉండాలి (5) కలప డిపోలు, పెట్రోలు

బంకులు, ఫ్యాక్టరీలు, "కెమిస్టుల షాపులు", పూరియిళ్లు, గడ్డివాములు మొదలైన ప్రమాద ప్రదేశాలు ప్రత్యేకంగా గుర్తించుకోవాలి. (6) "ఫైర్ హైడ్రెంటులు", పెద్దబావులు, చెరువులు, కాలువలు మొదలైన అధికంగా నీరుదొరకే స్థలాలు తెలిసియుండాలి (7) కార్లు, లారీలు, బండ్లు మొదలైనవాటి నంబర్లు, అవి ఉండే స్థలాలు తెలిసిఉండాలి (8) వివిధ ఎ. ఆర్. పి. సర్వీసులు ఉండే స్థలాలు తెలిసిఉండాలి (9) ఇంటింటికిపోయి ప్రజలు తీసికోవలసిన జాగ్రత్తలను తెల్పుతూ, వారి సందేహాలను తీర్చి, వారి ప్రశ్నలకు జవాబులివ్వాలి. వారికిచ్చిన సలహాలను ఎంతవరకు ఆచరణలో పెడుతున్నారో తెలుసుకుంటూ ఉండాలి. (10) వాలంటీర్లను చేర్చి వారికి శిక్షణఇచ్చి ప్రమాద సమయాలలో వారి సహాయాన్ని పొందాలి.

దాడుల సమయాలలో:—(11) ప్రజలను రక్షణతీసుకోమని హెచ్చరించాలి (12) హెచ్చరికలివ్వాలి (13) హెచ్చరిక వినబడినప్పుడు తన పోస్టు దూరంగా ఉంటే దగ్గరగా ఉన్న పోస్టుకుపోయి పనిచేయాలి (14) దాడులు రాత్రిలందయితే "బ్లాకవుటు" సక్రమంగా అమలు జరిపించాలి (15) ఒక వార్డెను ఎప్పుడూ పోస్టులో ఉండి మిగతావారు ప్రదేశమంతా గస్తీ తిరగాలి. (16) వాలంటీర్లు మొదలైనవారి సహాయంతో రాకపోకలు ఆపి రోడ్లు ఖాళీచేయించాలి. (17) తానుకూడా రక్షణతీసికోవాలి. (18) దాడివల్ల కలిగిన నష్టాలను గురించి రిపోర్టు సెంటరుకు రిపోర్టులు పంపాలి. (19) అవసరాన్నిబట్టి వీలునుబట్టి మంటల నార్పడం, తేలికరక్షణ, ప్రథమ చికిత్స మొదలైనవి చేయాలి. (21) "ఇన్సిడెంటు ఆఫీసరు" వచ్చేవరకు అతనిపనిని సీనియర్ వార్డెన్ చేస్తూ ఉండాలి.

## 2. మంటలనార్పే సర్వీసు (Fire Fighting Service)

ఈ సర్వీసులోనివారు "స్టిరప్ పంపు"లతోను, "ట్రైలరు పంపు"లతోనూ మంటలను ఆర్పుతారు. వీరి స్వాధీనం కాకపోతే "ఫైరుబ్రిగేడు"

రావలసి ఉంటుంది. ఈ సర్వీసులో మంటలను కనిపెట్టి రిపోర్టుచేసే "ఫైర్ వాచర్లు" కూడా ఉంటారు.

3. రక్షణ సర్వీసు (Rescue Service)

ఈ సర్వీసులోనివారు మండుతున్న ఇండ్లలోనివారిని, కూలిన ఇండ్ల క్రింద చిక్కుకున్నవారిని సంరక్షిస్తారు. ఈ సర్వీసులో తేలిక రక్షణ (Light Rescue) పార్టీలని, కష్టపురక్షణ (Heavy rescue) పార్టీలని రెండు రకాలుంటాయి.

4. వైద్యసర్వీసు (Medical Service)

దాడులలో దెబ్బలు తిన్నవారికి ఈ సర్వీసుద్వారా చికిత్స దొరుకు తుంది. ఈ సర్వీసులో ప్రథమ చికిత్సాలయాలు (First Aid posts), "ఆంబ్యులెన్సులు" "స్ట్రెచర్ పార్టీలు", ప్రథమచికిత్స పార్టీలు (First Aid Parties) ఉంటాయి.

5. వార్తల సర్వీసు (Communication Service)

ఈ సర్వీసులో పనిచేసేవారిని "మెసెంజర్లు" అంటారు. వీరు టెలి ఫోనులు లేనప్పుడు, టెలిఫోను కనెక్షన్లు తెగిపోయినప్పుడు వార్తలందచేస్తారు. వీరిలో కొందరికి సైకిళ్లు, కొందరికి మోటారుసైకిళ్లు ఇస్తారు.

పైనచెప్పిన సర్వీసులేగాక నీటిమార్గాలు, ఎలక్ట్రిక్ తీగలు, రోడ్లు మొదలైనవి చెడిపోయినపుడు బాగుచేయడానికి; పేలని బాంబుల్ని తొల గించడానికి; విషవాయువులు తగిలినవారికి చికిత్స చేయడానికి మొదలైన పనులకు ప్రత్యేక సర్వీసులుంటాయి.

## 6. కంబైన్డ్ డిపో & రిపోర్టు సెంటరు

ఇచ్చట రిపోర్టుసెంటరు డిపో కలసిఉంటాయి. వార్డెనులవద్దనుండి వచ్చిన రిపోర్టులు అందుకోడానికి, వివిధ సర్వీసులలో ఉండే పార్టీలు వాటి పరికరాలు ఉండడానికి, ఇచ్చట ప్రత్యేక ఏర్పాట్లు ఉంటాయి. దీనికంతకి అధికారిగా డిపో సూపరింటెండెంటు ఉండి ఇచ్చట జరగవలసిన పనులన్నిటిని సక్రమంగా జరిపిస్తాడు.

దాడులసమయంలో వార్డెనవద్దనుండి రిపోర్టులు రాగానే ఇచ్చట నుండి ప్రమాదం జరిగినచోట పనిచేయడానికి సర్వీసులు పంపబడతాయి.

## 7. "కంట్రోలు రూము"

ఇక్కడ ఎ. ఆర్. పి. ఆర్గనైజేషన్ కంతకీ అధికారి అయిన కంట్రోలరు ఉంటాడు. ఇతడు అన్ని సర్వీసులు సక్రమంగా పని చేసేటట్లు చూస్తూవుంటాడు.

## 8. "ఇన్సిడెంటు ఆఫీసరు"

ఇతడు ప్రమాదం జరిగిన స్థలమందు కంట్రోలరుయొక్క ప్రతినిధిగా ఉంటాడు. ఇచటికి వచ్చిన సర్వీసులన్నీ సంఘర్షణలేకుండా పరస్పర సహకారంతో పనిచేసేలాగుననూ, తక్కువకాలంలో ఎక్కువ పని జరిగేటట్లునూ చూస్తాడు. వచ్చిన పార్టీలు చాలకపోతే ఎక్కువ తెప్పించుకోడానికి, వచ్చినవి ఎక్కువయితే పంపించివేయడానికి ఇతనికి అధికారం ఉంటుంది.

## దాడుల అనంతరం జరగవలసిన పనులు

(1) ఇళ్ళు కూలినవారిని జాగ్రత్తపెట్టి క్షేమకరమైన ప్రదేశాలకు ఖాళీ చేయించడం (2) దెబ్బలు తిన్నవారికి చికిత్సచేయడం. (3) దేశ

రక్షణ కార్యక్రమాలలో పాల్గొనేవారికి గాయాలకి, ఆస్థి ప్రాణనష్టాలకి నష్టపరిహారం ఇప్పించడం. (4) బాగా దెబ్బతిన్న ఇళ్ళను కూల్చడం. (5) రోడ్ల రాకపోకలను అనుకూలంగా చేయడం. దెబ్బతిన్న ఎలక్ట్రిక్, నీటి మార్గాలు బాగుచెయ్యడం. (6) స్వంత ఆస్థులను రక్షణ హామీ యివ్వడం. (7) సమాచారాలు తెలియచేయడానికి ప్రమాదం జరిగిన చోట ఒక "ఇన్ఫర్మేషన్ బ్యూరో"ను ఏర్పరచడం (8) చచ్చిన వారిని పాతివెయ్యడం.

మొదలైనపనులు దాడి అనంతరం సక్రమంగా జరిగితేనే ప్రజల నిత్య జీవితం సక్రమంగా జరుగుతుంది. ప్రజల మనోధైర్యం చెడకుండా ఉంటుంది.

# 14. రిపోర్టులు పంపుట

దాడులవల్ల ప్రమాదం జరిగిన ప్రదేశంలో నష్టాన్ని తగ్గించడానికి రిపోర్టు సెంటరుకు పంపే రిపోర్టులు ఈడిగువ విధంగా ఉండాలి.

1. 'ఎక్స్‌ప్రెస్ మెసేజి'

వార్డెను పోస్టు నెం.......

టైము.........

స్థలం.........

అశక్తులైనవారి సంఖ్య (కూలిన ఇండ్లక్రింద యిరుక్కున్న వారి సంఖ్యతో కూడా) .........

నిప్పు ఉంటే ఉందని......

రిపోర్టు నెం......

మెసేజి ఆఖరు

Werden's post No......

Time of occurrence.........

Position of occurance......

Approx. No. of casualities (Trapped if any)......

If fire, say so.........

Report No.........

Message Ends.

2. 'డేమేజి రిపోర్టు'

వార్డెను పోస్టు నెం. లేక
పంపేవారి పేరు హోదా } ......

స్థలం.........

బాంబుల రకాలు పే—మం—విష వా.

అశక్తులైనవారి సంఖ్య (కూలిన యిండ్ల క్రింద యిరుక్కున్నవారి సంఖ్యతో కూడా).........

నిప్పు ఉంటే ఉందని......

నష్టపడిన ప్రధానమార్గాలు. నీరు - కోల్ గ్యాస్ - ఎలక్ట్రిక్ సిటీ - మురుగు

మూయబడిన రోడ్ల పేర్లు......

పేలని బాంబులున్న స్థలం......

టైము......

వచ్చిన లేక వచ్చుచున్న సర్వీసుల పేర్లు......

రిమార్కులు

రిపోర్టు నెం......

మెసేజి ఆఖరు

# DAMAGE REPORT

Air Raid Damage (Commence report with these words)

Warden's Post No.
or Name and Disignation of Reporting agent } .........

Position of occurrence.........

Type of bombs H. E—Incendiary—Poison Gas

Approx. No. of Casualities (Trapped if any).........

If fire, say so.........

Damage to mains Water/Coal Gas/Electric cables/Sewers

Names of Roads closed.........

Position of any unexploded bombs.........

Time of occurrence (approx)......

Services already on the spot or coming.........

Remarks.

Report No.........

Massage Ends.

## 3. ‘సప్లిమెంటరీ మెసేజి’

డేమేజి రిపోర్టులో లేని కొత్త విషయాలను మాత్రం దీనిలో పంపాలి.

పై రిపోర్టులలో వ్రాసే విషయాలు అతి క్లుప్తంగా ఉండాలి.

టైము వేసేటపుడు రైల్వే టైములాగ 24 గంటలు వాడాలి. సాయంకాలం గం. 5 ని. 30 (5-30 P. M.) అంటే 17-30 అని అనాలి. మొత్తం నాలుగు స్థానాలు. గంటలకి రెండు స్థానాలు, నిముషాలకి రెండు స్థానాలు. ఏ స్థానంలో అంకె లేకపోతే ఆ స్థానంలో సున్న చుట్టాలి.

చివర మెసేజి నెంబరు వేసేటపుడు రిపోర్టు సెంటరులోఉన్న "టెలిఫోనిష్టు" రిపోర్టు ఆఖరున చెప్పిన టైమును మధ్య చుక్క పెట్టకుండా వెయ్యాలి. అదే మెసేజి నెంబరు అవుతుంది.

జరిగినస్థలం వ్రాసేటపుడు స్పష్టంగా రెండు గుర్తులు చెపితే సరిపోతుంది. (బి సెంటురోడ్డు పోస్టాఫీసువద్ద)

బాంబుల రకాలలో ఏబాంబులు పడితే అవి ఉంచి మిగిలినవి కొట్టివేయాలి. అశక్తులైనవారిసంఖ్య వేసేచోట ఇలా వెయ్యాలి. "75 వారిలో ఇరుక్కున్నవారు 15". నిప్పుఉంటే "ఉంది" అని లేకపోతే "లేదు" అని వ్రాయాలి.

నష్టపడిన ప్రధాన మార్గాలలో ఏది నష్టపడితే అది ఉంచి మిగిలినవి కొట్టివెయ్యాలి.

రోడ్డు అంతా త్రోవలేకుండా గొయ్యిపడిఉన్నా, ఇళ్లు కూలడానికి సిద్ధంగాఉన్నా, (ప్రక్క త్రోవలేనపుడు) విషవాయువున్నా, పేలని బాంబుఉన్నా ఆరోడ్డు మూయబడిందంటాం. అత్యవసరంగా చెప్పవలసిన ఇతర విషయాలుంటే రిమార్కులలో చేర్చాలి.

ఆర్గనైజేషను ఏవిధంగా ఉండాలో, దానిలో ఏయే సర్వీసులు ఉండాలో, అవి ఏయే పనులు చేయాలో మొదలగు విషయాలను క్లుప్తంగా తెలియచేయడమయింది. పల్లెలలోనూ, ప్రభుత్వ ఎ. ఆర్. పి. ఆర్గనైజేషన్లు లేని పట్టణాలలోనూ ప్రజారక్షణ కమిటీల ఆధ్వర్యంక్రింద పనిచేసే ప్రజా రక్షణ దళాలలో కొన్ని దళాలను ఎ. ఆర్. పి. పనుల నిమిత్తం ప్రత్యే కించాలి. ముందు ముఖ్యంగా మంటలనార్పే దళాలు, రక్షణదళాలు, ప్రథమ చికిత్సదళాలు తప్పక ఏర్పరచాలి. ఈ దళాలపని ప్రజలను

ఎల్లప్పుడూ ఉపయోగపడుతుంది. దళాలసంఖ్య అధికమైనకొలదీ వార్డెనుల దళం, మెసెంజర్ల దళంకూడా ఏర్పరచాలి.

ఈ దళాలు తాము నేర్చుకున్న విషయాలని "ప్రాక్టీస్" చెయ్యడం ద్వారానూ, ఇతరులకు బోధించడంద్వారానూ, సాహిత్యాన్ని చదవడం ద్వారానూ అభివృద్ధి చేసుకుంటూ ఉండాలి. సాధ్యమైనంతవరకు పరికరాలని సమకూర్చుకొని ప్రజలందరికీ శిక్షణనివ్వాలి. ఈవిధంగా శిక్షణ నివ్వడం ద్వారా ప్రజలు తమ్ము తాము రక్షించుకొనేలాగున చేయగల్గుతాం. ప్రతి పట్టణాన్ని పల్లెనుకూడా ఈవిధంగా తయారు చెయ్యగల్గినపుడే దేశరక్షణ సక్రమంగా నెరవేరుతుంది.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B104 |
| పుస్తకం పేరు | వి మా న దా డి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |